శ్రీ ర స్తు.

---

శ్రీసద్గురుభ్యోనమః.

# చంద్రహాసనాటకము,

# కంపెని డ్రామా.

ఇది, గుంటూరుజిల్లా ప్రాంతమంగళగిరి
గంజి నాగయ్యగారిచే
రచియింపఁబడినది.

ఇది,
పండితులచే బరిష్కరింపఁబడి.


## కో - గోవిందరాజు ముదలారివారి

వలన,
జీవరత్నాకర ముద్రాక్షరశాలయందు
ముద్రింపించి ప్రచురింపఁబడియె.

చెన్నపట్టణం.

1912

దీనివెల, అణాలు ౦-౪-౦

# ప్రకటన.

| | | | |
|---|---|---|---|
| జగనోహినివిలాస డ్రామా. | 0 | 8 | 0 |
| ధన్వంతరి వైద్యచికిత్సా సారము | 0 | 12 | 0 |
| ఆంజనేయశాస్త్రి నామావళి | 0 | 4 | 0 |
| భాగవతం ౪౦ బొమ్మలు | 1 | 8 | 0 |
| పెద్దటీకా అమరం | 1 | 0 | 0 |
| దేవయాన నాటకం | 0 | 3 | 0 |
| వశిష్ఠప్రోక్త వైద్యశాస్త్రము | 1 | 8 | 0 |
| దశమస్కంధము పదము. | 0 | 10 | 0 |
| నీతిశాస్త్రం ౩ అయసం | 0 | 3 | 0 |
| పెద్దరామదాసుచరిత్ర | 0 | 5 | 0 |
| విరాటపర్వం వచనం | 0 | 12 | 0 |
| కపోత వాక్యం | 0 | 2 | 0 |
| బాలనాగమ్మ కథ | 0 | 3 | 0 |
| బొబ్బిలిరాజుకథ. | 0 | 4 | 0 |

పై పుస్తకములు ఇతర సంస్కృతాంధ్ర గ్రంథములు స్కూలు పుస్తకములున్ను విక్రయించబడును. వలయువారలు చెన్నపట్టణం వడమలమేస్త్రి వీధి డోరునెంబరు ౨౦-గల గృహమునందుండు శ్రీ గోవిందరాజు మొదలియారుగారికి వ్రాసి తెప్పించుకొనవచ్చును.

# ఈనాటకమునందు వచ్చు పాత్రలు.

## పురుషులు.

రాజు-(సత్యవంతుడు) దేశమునుపాలించువాడు

మంత్రి-దుర్మార్గుడు) అపకారముచేయువాడు (జెప్పువారు

జ్యోతిష్కులు-(జ్యోతిషముచదివినవారు)భూతభవిష్యద్వర్తమానము

సేవకుడు- (బంటు) చెప్పినపనిచేయువాడు

సూనరులు-(దుర్మార్గులు) జీవహింసచేయువారు

చంద్రహాసుడు-(సుందరుడు) సుబుద్ధిగలవాడు

కుళిందుడు-(రాజు) చంద్రహాసునిపెంచినవాడు

మదనుడు-(నీతిమంతుడు) మంత్రికుమారుడు

పురోహితులు-(బ్రాహ్మణులు) పెండ్లిచేయించువారు

పరివారకులు-(కాపులు) రాజ్యమందుండువారు

## స్త్రీలు.

కుళిందునిభార్య-[పతివ్రత] పెనిమిటియాజ్ఞమీరినది

విషయ-మంత్రికొమార్తె-మిక్కిలియోచనగలది

చంపకమాలి-రాజుకొమార్తె-మిక్కిలి చక్కనిది

కాలికాదేవి-పార్వతి-కోరినవరములిచ్చునది





శ్రీరస్తు.

శ్రీ రామ జయం.

కంపెనీ డ్రామా.

# చంద్రహాస నాటకము.

## నాందీ.

శా॥ శ్రీరామా చరణాంబుజంబులు సదా చింతింతు నా మానసం।
బేరీతిన్ భువి పామరాదుల మదిన్ నెన్నంగ దానేర్చునే।
నీరాసారస నాభ నీదు పదవిన్ నీ నామమే నమ్మితిన్।
జేరందీసి యు నన్ను బ్రోవు దయతో సీతామణీ నాయకా॥

(నాందిముగియగానే సూత్రధారు ప్రవేశం)

వ॥ ఆహా కాలహరణంబయినను నటి యింతవరకు రాకయున్నది కారణంబేమో తెలియదు. అయినను కొంతతడవు చూచెదను.

(నటి ప్రవేశము.)

వ॥ నాధా యిదుగో వచ్చుచున్న దానను కోపము చేయకుము నాధా వందనము గైకొనుడు.

సూ, వ॥ సఖి దీర్ఘాయుష్మంతురాలవుకమ్ము.

నటి॥వ॥ ఆర్యా యే దైవనాటక వినోదంబగు నాటకమును గావించి పూజ్యులగు నీసభాపతుల కానందంబు గావింపుదు,

సూ॥ వ॥ సఖీ యందుకేగదా నింత ప్రయత్నంబు జేయుచున్నవాడ,

నటి॥వ॥ ఆ నాటకమునకు నామంబేమి,

# చంద్రహాస నాటకము.

సూ॥వ॥ చెలి చెంగటరత్నం బుంచుకొని యంగ[illegible]ల్ల వెదకనేల చంద్రహాసనాటకము మనదగ్గరనేయున్నదికదా.

నటి॥వ॥ అవును ఆనాటకము రచియించినవారి నామంబ్లించుక తెలియజేయుము.

సూ॥వ॥ అటులయిన వక్కాణించెదవినుము.

సీ॥ శ్రీరమ్యముగనరసింహార్యునికరుణచేధాత్రిభారతఋషిగోత్రు
డగుచు।శోభితాపస్తంభసూత్రపవిత్రుండుగంజిగృహానాము
డుకసకయాఖ్య్యు । నాతనికలసతియగునాగమాంబిక । గర్భ
మునందునగలిగె సుతుడు । నరసింహ్మా హ్వాముడుమరిసుబ్బంత్ర్యని
పరిణయమాడెను ప్రజలుమెచ్చ, తే॥ గీ॥ విన తలకాని నాసతివి
మలగర్భ । శుక్తియందునగల్గెను మౌక్తికములు । సుతుడుసుద
తిగుయసందు భూసురులు మెచ్చ; నాగదాసుడురచియించెసీనాట
కమును।

నటి॥ వ॥ (సంతోషముతో జూచి) యింతవట్టుకు మీరునుడివినదెల్లను హృదయాహ్లాదము కలిగించుచున్నదియిది యింకాతీర్ఘకాలంబిసంభాషణతో ప్రొద్దుబుచ్చక నాటకం భారంభించి ప్రజల నిరీక్షణను సఫలపరుచుదాము.

సూత్ర,వ॥ (హాస్యముతో) ఆలాగేపోదమురమ్ము.

(అని వెళ్ళుచున్నారు.)

(రా జు మం త్రి కో ర్టు.

రాజు, వ॥ (మంత్రినిజూచి.) ఓమంత్రిపుంగవా మనరాజ్యంబున - చాతుర్వర్ణజనంబులు- స్వకులోచిత ధర్మంబు లనుసరించి వర్తిల్లుచున్నవారలే - వారిప్రాణధనంబులు నిరుపాయంబులే - మరియు రాజులకు చారులు నేత్రముల వంటివారు వారియపచారంబులు స్వనేత్రాప చారంబులకలె - నాపదలకు నెవ్వులుగాన చారులవల్లన స్వదేశవిదేశవృత్తాంబుల సమయాను

# కంపెని డ్రామా.

కూలంబుగా నెత్తుంగుచున్నవాడవే ఇదియునుంగాక - ప్రజానురాగంబు - రాజ్యసంపదలకు మూలంబుగాన- మనపాలనంబునం దయ్యదిగలదె- మరియు విశేషంబు లెవ్వియైనగలవేని వక్కాణింపుము.

మంత్రి॥ వ॥ (హర్షముతో,) రాజోత్తమా ప్రజానుగ్రహంబును శిష్టపరిపాలనంబును - యధాన్యాయంబుగ నొనరించు మీపాలనంబున నెవ్వరికేని ననురాగంబు నొడయకుంటు బృత్యజనంబులు - తమయాజ్ఞను శిరంబునధరించుచు స్వస్వనియుక్తవ్యాపారంబుల విశ్వాసంబున - నెరవేర్చుచున్న వారలుచార పచారంబులు - లేశంబునుంగానంబడవు.

రాజు॥ వ॥ (మంత్రినిజూచి,) మంత్రిశేఖర మనరాజ్యంబునంగల భూసురనికరంబులెల్ల - వేదవేదాంగ శాస్త్రపురాణపారీణధురీణ- విచక్షణ ప్రమోదాయత్తచిత్తులై సుఖంబుగా నున్నవారు గదా.

మంత్రి॥ వ॥ (కౌతుకముతో.) రాజోత్తమా మనరాజ్యంబునంగల భూసురనికరంబులెల్ల- వేదంబులనించుక తోనితడబాటులే [illegible] - [illegible] యంచరొతునైసంబంచలపాలుగా వింపనెంచియున్నవారలు.

రాజు॥ వ॥ మంత్రిపుంగవా భుజపరాక్రమ సహసధైర్యంబులసరశూరాగ్ర నైనందికేసరిపంజాలు క్షత్రియోత్తములు కదనప్రమోదాయత్తచిత్తులై నొప్పుచున్నవారలుగదా,

మంత్రి॥ వ॥ రాజోత్తమా మనరాజ్యంబునంగల క్షత్రియోత్తములు [illegible] జయకౌతుకంబుతో నొప్పియున్నవారలు.

రాజు॥ వ॥ మంత్రివర మనరాజ్యంబునంగల వైశ్యవ్రాతంబులెల్ల- నికలదేశంబులకరిగి వాణిజ్యబొనరింపుచు ధనంబునార్జింపుచున్న వారుగదా,

మంత్రి॥ వ॥ రాజా మనరాజ్యంబునంగలవైశ్యవ్రాతంబులెల్ల నిఖిలదేశంబులకరిగి వాణిజ్యంబొనర్చుచు ధనంబునార్జించి బొక్కసంబుల కెక్కువమై యెక్కుభేదమైనం లెక్కగొనక ధిక్కరించుచున్నవారలు.

రాజు॥ వ॥ శబాష్- ఓమంత్రి మనరాజ్యంబునంగల శూద్రజనంబులు తమతమవర్ణాశ్రమాచార ధర్మంబుతప్పక వర్తింపుచున్నవారలే.

మంత్రి॥ వ॥ రాజోత్తమా- మనరాజ్యంబునంగలశూద్రజనంబులు - తమతమవర్ణాశ్రమాచార ధర్మంబులు తప్పక వర్తింపుచున్నవారలు.

రాజు॥ వ॥ ( మంత్రినిజూచి. ) మంత్రివర్య నేనసుష్ఠానవిధులొనర్చు సమయంబయ్యె యింకనేనేగుచున్నవాడ.

వ॥ ( అనిరాజువెళ్లుచున్నాడు, )

వ॥ యిచ్చటమంత్రివద్ద చంద్రహాసుడుండగా జ్యోతిష్కులువచ్చుట,

మంత్రి॥ వ॥ జ్యోతిష్కులారా వందనంబాచరించెదా.

క॥ వందనమిప్పుడుమీకును।
వందనమొనరింతునిపుడువాసిగమీకున్ ।
వందమిదిగ్గైగొనుడీ ।
వందనమును జేయుటకును వాంఛదయిగ్గాక్॥

జ్యో॥ వ॥ ( హర్షముతో. ) ఓంమంత్రిపుంగవా నీవునాయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధిరస్తుగావరిలుము మరియు.

క॥ వర్ధిల్లుమిలలోనీవును ।
వర్ధిల్లుముహరియుకృపచేవనరుహనేత్రా ।
వర్ధిల్లుమంత్రిపుంగవ ।
వర్ధిల్లుసకలంబుగలిగివాసిగధాత్రిన్॥

మంత్రి॥వ॥ (కౌతుకముతో) మీరలిచ్చటి కరుదెంచినకార్యం బెద్దియో త
యాన నెరిగింపుడు,

జ్యో॥ వ॥ (వినయముతో) స్వకులోచిత ధర్మంబుల నెరవేర్చుటకై నిచ్చటికి
రుదెంచితిమి-నింతియెకాని మరేమియు లేదు,

(అని చిన్నవానిజూచి,)

తే॥ గీ॥ యిచటిబాలుడునెవ్వడోయిపుడుమాకు।
వీనిమోమునుబూడగనిధునిబోలి।
రాజచిన్నెలుగనుపడె తేజముగన।
దాచ నేటికిచెల్వుముదయయుగల్గి॥

వ॥ యీబాలుండెవడు వీనిమ ఖకళజూడ రాజచిహ్నములుదోచుచున్నవి,
మంత్రి - చిరునవ్వుతో,

తే॥ గీ॥ యితడు వేడుకతోడనాయింటికొచ్చి।
బాలకులతోడగూడియు మేలుగాను॥
నాటలాడుచునుండెను వాటముగను॥
యిట్టివాడని నేనెరుగగట్టిగాను॥

వ॥ యితడు నాయింటిచేరువ బాలురనేకులువచ్చి ఆటలాడుచున్నవా
రిలో నొకండు వీడుయిట్టివాడని నేనెరుంగ.

జ్యో- వ॥ (వినయముతో) యీ బాలునియందు రాజలక్షణము లనేకములు
కానంబడుచున్నవి - వీడువకసమయమునందు యీదేశపురాజగు
ననుటకు నెంతమాత్రముసందేహము లేదు - నీపరివారమునకును
నీసొత్తునకును, ఇంకవీడు యధికారియవును వున్నవాస్తవము జె
ప్పితిమి యింకమేమేగుచున్నవారము,

మంత్రి, వ॥ (భయముతో) జ్యోతిష్కులారా వందనం బాచరించెద,
జ్యో॥ వ॥ (హర్షముతో) శుభంశుభం అనిజ్యోతిష్కులు చంద్రహాసుడు
వెళ్లవలెను,

మంత్రి-వ॥ స్వగతం జ్యోతిశ్శాస్త్ర పండితులు యేవిషయమును విద్యోక్తముగా బరిశోధింపక స్థైర్యముతో బహిరంగముగా జెప్పవారుకారు - వారుశెలవిచ్చినదానియందు - వాస్తవమేదో యుండవలెను-మరియు,

చ॥ చెరుపును రాకమున్దుగనె జాగ్రతనొందుట మేలు మేలయా।
పురమునయుండు జ్యోతిషులు బూనికవాక్యము జెప్పకుండవా।
రరిగి రికాని నేటులరాదగు హానియు నాను జెందునన్।
మరచియునుండగూడదిటు మానుగదీనికి నేమిసేయుదున్॥

వ॥ చెరుపు రాకముందు జాగ్రత పడుటయే తెలివిగలవాని లక్షణము- యెట్టికీడును రాకుండునటుల ముందుగనే జాగ్రతపడవలయు,

మంత్రి॥ వ॥ కోపముతో ఓరేసేవకా మన పట్టణంబునందు గల సూనరులను బిలుచుకరమ్ము,

సేవకుండు బిలువగా సూచరులు ప్రవేశించుట,

సూ॥ ముకుళితకరములై,

తే॥ గీ॥ మంత్రిశేఖరమీరునుమమ్ము నిపుడు।
బిలువనంపినకార్యము బిరనుదెల్పు।
వేగ జేసెదముజూడుడీ వేడుకలర।
తడవు జేయుటగూడదు ధన్యచరితా॥

వ॥ మంత్రివర్యా మమ్ముల బిలిపించిన కార్యం బెద్దియో చెయ్యననెరింగింపుడు,

మంత్రి-సూనరులంజూచి,

ఉ॥ సూనరులార మీరిపుడు సుందరవంతుడటంచు నెంచక।
కానను మీరు వేగమున కూల్చుడు మీదయలేక వీనినిన్।
కానన మంద్ద మీరు గొని కాయము నొవ్వగ వీని గోసినా।
మానము సిల్లగా వలయు మా ఘ్నాను లిస్తును మీకు ప్రేమతో॥

వ॥ సూనరులారా మద్గృహంబున నాటలాడుచుండు యబ్బాలుని గొం
పోయి యెవరును జూడకుండ నీరాత్రి యరణ్యంబున వీనిశిరంబునుం
ద్రుంచి నెద్దియేని యానవాలుగా గొనిరండు నిదియేమమ్మాటి శె
లవు పొండు,

సూ, వ॥ [మంత్రినిజూచి] మంచిది నొక్కయేటున గాటులంబెట్టి మ
ట్టుపరచి గుట్టుయెల్లడికానీక బట్టుకొనిపోయెదము యిదుగో నే
గుచున్నవారము,
[చంద్రహాసునిజూచి,]

సూ- [కోపముతో] మత్తకోకిల,

ఓరిబాలకనిన్ను మేమునునొక్కయేటుగాటులన్।
జీరివేగమెకాయుమిప్పుడు చెండెదన్ నీవుజూడుమీ।
సారెసారెకుజెప్పనేటికిచావునీకునుమూడెరా।
సారసాక్షుడుమంగళాచలశౌరినిమదినమ్మరా॥

వ॥ ఓరిబ్రష్టా నీచవున్మత్తాగ్రేశర - మదీయప్రభుండగు మంత్రిశేఖరుం
డు నిన్ను కాననంబునకుం గొనిపోయి నీశిరంబు చెగటార్చుమని మ
మ్ములంబంపె - కార్యసాఫల్యంబు జేయంగోరి నిచ్చటికరుదెంచితి
మి - జాగుసేయక వెడలుముచంద్ర - కన్నీటితో యెందులకై నన్ను
జంప మిమ్ముబంపెను వచింపుడు-

సూన॥ వ॥ [రౌద్రముతో] అదియంతయు నీకుంజెప్పమాకుంబనిలేదు - అ
యినను మత్ ప్రభువునకుం బగతుండ వైతివని వధియింపం
బంపిరి,

చంద్ర - శోకముతో,

సీ॥ నేనాపగతుండనునెరుగనునేకల్ల నన్నాదరించెటినాప్తులెవరు।
నేపసిబాలుడ నెందుకువచ్చితి కాపాడెరక్షించెఘనులులేరే।
నేతలిదండ్రులనెరుగకయుంటినినీతతో రక్షించెదయ్యలేరె।
నేనపకారంబునెరుగనుకల్లనెవ నన్ను।బోచెటినాథుడేడి॥

తే॥ గీ॥ ఏమిశేయుదునీశ్వరుండిట్లుజేసె।
కటకటాయింతకష్టంబుగల్గెనాకు।
కరుణజూచియుబ్రోవుడికనికరమున।
నన్నువధియింపమీకున్యాయమానే॥

వ॥ నేనాపగతుండను నన్నాదరించువారు లేక అచ్చటచ్చట దిరిగి చూచువా రెవరైనను మనసుకరంగిపెట్టెడు యన్నంబును భుజియించి నాయీడు బాలురతో గూడి నన్యోన్యముగా నాటలాడుచుంటినే గాని నెన్నండు నొకరి కపకారం బొనర్చిన వాడనుకానే-నన్నేల జంపుటకె నుద్యుక్తుండయ్యెను,

సూన- రౌద్రముతో మత్తకోకిల.

ఓరినీతులుమానివేయకవాదమేటికెనీకు రా।
పారిపోవగనీమచెందునభ్రాంతిబుట్టెనుజూడగా।
నేరమేమియునెంచకిప్పుడునిన్నుజంపగబంపెరా।
సారసాక్షుడుమంగళాచలశౌరిబ్రోచునుప్రేమతో॥

వ॥ ఓరినీతులు వకాణించి ఖ్యాతికెక్కదలంచుకొంటివా యేమి- యెట్టులయిన నిన్నుకట్టికొట్టి - ఘట్టిగానీడ్చుకొనిపోయి బరిమార్చెదము చూడుము మాపరాక్రమము - [అని చంద్రహాసుని నీడ్చుకొనిపోయి.]

(చంద్రహాసుడు దీనత్వముతో సూనరుల జూచి,)

సీ॥ సూనరవరులార జూడరే నాకెవరు దిక్కును లేనట్టిదీనుడనుచు।
సూనరవరులారజూడరే నాకుండు దానము జేయని హీనుడనుచు।
సూనరవరులారబూడరే నాబాధ చలమును మానియు శాంతులగుచు।
సూనరవరులారజూచియుబ్రోవరే యన్నము లేని నాపన్నుడనుచు॥

గీ॥ వేయివిధముల మిమ్ము నే వేడుకొంటి।
నన్ను బ్రోవరె వదయతో నుసన్నుతింతు।
నేరమెంచియుమంత్రియునిట్లుజేసె।
దీనజనుడనునన్నుగావదిక్కుమీరే॥

వ॥ ఓసూనరులార ఆత్మవత్ సర్వభూతాని యనున్యాయంబున శరీరంబులు వేరుగాని ఆత్మనొక్కటెననియు పిపీలికాది బ్రహ్మపర్యంతం సర్వభూతంబులు తనవలెనే జూచువాడు బ్రహ్మజ్ఞానియనియు పెద్దలువక్కాణించి యుండిరి గదా నిదియునుంగాక నహింసాపరమోధర్మ యనుశ్రుతి ప్రమాణంబుచొప్పున ప్రాణహింస జేయు నెన్నటికిని కూడునా - నటుల ప్రాణహింసచేయువారుపరలోకవర్జితులై రౌరవాదినరకంబులను జెందగలవారు సర్వభూతదయాళుండగు యాపరమేశ్వరుండు మీయెడ కరుణకలిగి నన్ను గాపాడి రక్షించునని వేడుచున్నవాడ॥

జంఝూటిరాగం - అటతాళం.

మంగళాచలాపురా మహితానివాసకా । మంగళాకరగుణా మహాదేవసన్నుతా॥మం॥

అంగజాభస్వాంగా । నమితాసుప్రాసంగా । గంగాజటాజూటా । గాత్రేషనోభృంగా॥మం॥

ధరమంగళాచలా । ధామానివాసకా । కరుణాతోనాగయ్యాకవివరపోషకా॥మం॥

సూన॥ వ॥ (ప్రియముతో) మంచిది మేమునియోగించిన పని నెరవేర్చుటకు మీకిష్టంబు గలుగనిచో-మేమిమ్మెట్లువిడచి పుచ్చవలెనో తెలియకున్నయది అయిననునీజ్ఞానబలంబును శాంతతయును - బలంగూడా - వివేకులంజేయుచున్నయవి - నీతోచెలిమి గావించుటకంటె - మాకున్నొంటకోరికలేదుగాని - నిన్నువధించినట్లునెట్టి నైన గురుతు మాప్రభునకుం జూపట్టివలె అని నవయంగము లుపరిశీలించి మరియు నీపాదంబులు - షష్టాంగుళ సహితంబై యున్నయదిగాన - నందొక్క నంగుష్టంబు గోసుకొని మేమేగెదము.

(అని వ్రేలుగోసుకొనివెళ్లిరి.)

(చంద్రహాసుడుదుఃఖముతో,)

వ॥ హాదైవమా దీనదయాళో నేనేమిచేయువాడను నన్నుపాతకులు గా

నివచ్చి పెట్టరానియిడుములంబెట్టి దుఃఖాబ్ధిని మునుంగునటులఁజేసి పోయిరిగదా - నయ్యయ్యో ఘోరంబైన నీకీకారణ్యంబునసింహవ్యాఘ్రశార్దూలభల్లూకాది మృగంబుల ఘీంకారంబులు నాచెవిసోకినంతమాత్రముననే - నాగుండెలు కొట్టుకొనుచున్నవి- నన్నుచేరందీసి భయంబుపాపి రక్షించువారెవ్వరును గానరారైరి - ఆహా నాజన్మమే కష్టజన్మము - నాజన్మమువంటి దిక్కుమాలి జన్మం బీలోకంబునం దెవ్వరికిని గలుగకుండునటుల - కటాక్షింపుమయ్యా శివే శివేపరమేశ్వరా,

ఎదుకులకాంభోదిరాగం - అటతాళం.

శంకరా నీవునా । సంకటముసుబాప । శంకానీకృపరాదా పంకజలోచనా॥శం॥

క్రూరాత్ముఁడు మంత్రి । కుటిలాముదలపోసి । నేరామేమియులేక। పీరాలాబంపెను॥శం॥

దిక్కెవ్వరును లేని । దీనాజుఁడనాని । కకారసంబుగవారునొకార్వేలునుద్యంచె॥శ॥

ధరణిలో మంగాళా । గిరిపురవాసక । వరమల్లేశ్వర నామొరవిని బ్రోవరా॥శం॥

(కుళిందుఁడు ఆరణ్యామందుబ్రవేశించుట,)

(కుళిందుఁడు)వ॥ ఆహా యెవ్వరో నొక బాలుండి యరణ్యంబున రోదనంబొనర్చునటుల గానంబడుచున్నయది - కొంతదడవు యోచించిచూచెదను.

చంద్రా॥వ॥ (దుఃఖముతో) ఆహాశివెశివేపరమేశ్వరా,

(కుళిందుఁడుదగ్గిరకుపోయి,)

తే॥గీ॥ జంట నెవ్వరు లేకనువంటరిగను।
వేనమునంమనబాలుఁడువసుధమీద।

బడియడుకుంటుచున్నుండె బహుబాధచెల।
నీతలిదండ్రులెవ్వరో నెరుగఁజాలరయా॥

వ॥ వత్సా నీవెవ్వండవు జంటనెవ్వరులేక నొంటరిగా నీఘోరారణ్యంబున - తాళలేక నేలంబడి దుఃఖించుచున్నవాడవు- మీకిష్టంబొనర్చిన దుష్టాత్ములెవరు నీతలిదండ్రుల నామంబేమి నెరిగింపుము.

(చంద్రహాసుడు దుఃఖముతో,)

వ॥ అయ్యా నేనొక్క రాజకుమారుండను నాకెవ్వరును దిక్కులేక నొక్కరుండనై నిచ్చటికిచ్చేరువనుండు పట్టణంబున - నచ్చటచ్చటం కనికరంబున వారిడుయన్నంబును భుజియించి నాసరిబాలురతో దిరుగుచున్న నప్పుర మంత్రిశేఖరుండొకడు - కారణంబేమియు లేకనే నన్ను ఖండించ సూతుల కాజ్ఞాపించిరి - వారు నన్నుం గొనివచ్చి యీయట్టడవిలో చంపనుద్యుక్తులైరి వారితోనే నుడువు హితవాక్యంబులంవిని నాయందు కరుణగలవారై నాపాదంబు షష్టాంగుళ సహితంబైయుండుటంగనినం దొక్కనంగుష్టంబు గోసుకొని పోయిరి నబ్బాధకేనోపజాలక - నేలంబడి ప్రలాపించుచున్నవాడ - నాతలిదండ్రులెట్టివారో నేనెరుంగ - నాపాటిదైవమే మీరైయుండవచ్చు రక్షింపుడురక్షింపుడు.

జంఝూటిరాగం - ఆదితాళం.

కరుణించుమీ రాజోత్తమ। మరిమారి వేడితిమరిమారి వేడితి । దోరజానిగోరితి॥క॥

దీనుడనునన్ను బ్రోవనీకను । మానమేలాను । యనుమానమేలాను। తాళగజాలను॥క॥

ధరణిలో శ్రీమంగళాచల । హరియుసాక్షిగా । హరియుసాక్షిగా। మరిబతిమాలితిగా॥క॥

కుళిందుడు (దయతో)

తే.గీ॥ వినుము బాలుడ నిన్ను నీ విపినమందు।
కష్ట మొందించినట్టి యా కఠిను డెవడు।
తెలియ జెప్పుము నాకును తేటగాను।
నిను గొనిపోదు నా వెంట నిపుడు రమ్ము॥

వ॥ మంచిది యా దుష్టాత్ములు నీ కెట్లొనర్చిపోయిరి- అయినను నేమి - నే నిన్ను గొనిపోయి షడ్రసోపయుక్తంబుగా భోజనంబిడి స్వీకారంబు జేసుకొనియెద- మద్గృహంబున నుందువు- నా వెంట రమ్ము,
(అని లేవనెత్తుకొనిపోయి)

(కుళిందుని భార్య ప్రవేశించును,)

కుళిందుడు॥ వ॥ (భార్యను జూచి) సఖీ యీ బాలుం డరణ్యంబున - పగతులచే కాలి వ్రేలు తరుగంబడి నెత్తురు వెల్లువయై పార నేలంబడియుండుటం గని వీని ముఖసుందరంబునుం గాంచి - పేదకు దొరకు పెన్నిధాన చందంబున నిచ్చటికిం గొనివచ్చితి- వీని స్వీకారము జేసుకొనియెదము- వీని వలన నన్ని కార్యములు నెరవేరగలవు- నీ యభిప్రాయం బెరిగింపుము,

భార్య, (హర్షముతో)

చ॥ తనయులు లేనివారికిటు తామరసాక్షుడు నేడు ప్రీతితో।
తనయుని కాననంబునను దానిటు జూపెను నాకు జూడయీ।
దినమున నీకుమారునకు ధీనిధి జేయుము నీవు కూర్మినో।
మనమున సంతసించితిని మారుని బోలు కుమారు జూచితిన్॥

వ॥ నాధా అపుత్రస్య గతిర్నాస్తి యను శ్రుతి ప్రమాణంబు చొప్పున పుత్రులు లేనివారికి గతులు లేవని పెద్దలు వక్కాణించి యుండిరి గదా మనము పుత్రహీనులమై యున్నందుకు యా భగవంతుడు నేటితో నే బాపి మనకొసంగెను మనపట్టణంబునం గల జ్యోతిష్కుల రావించి, వీని నామకరణం బొనర్పుడు ॥

కుళిందుడు, వ॥ (కౌతుకముతో,) మంచిది ఒరే శేవకా మనపట్నంబునంగల జ్యోతిష్కులను నిచ్చటికిరావించుము.

(జ్యోతిష్కులు ప్రవేశించుచున్నారు.)

కుళిందుడు, వ॥ (ప్రీతితో.) జ్యోతిష్కులారా వందనంబాచరించేదా.

జ్యోతి, (కుళిందునిజూచి) శుభం శుభం.

కుళిందుడు, వ॥ (సంతోషముతో) యీవుచితాసనముమీదవసింపుడు- యీ చిన్నవానికి నామకరణంబొనర్పుడు.

(యిచ్చటజ్యోతిషంబుజూచి నటుల గమనించవలెను)

జ్యోతి, (కులిందునిజూచి,)

తే॥ గీ॥ వీనిముఖకళవర్ణింపవిభునిబోలు।
గానవీనినినామముకలియుగమున।
చంద్రహాసుడనితడనిజెప్పవచ్చు।
మీకుదెల్పితిమిప్పుడుమేదినీశ॥

వ॥ యీబాలుడు మిగుల భాగ్యవంతుడగును వీడునవ్వునప్పుడు వీనిముఖ మున్నమ చంద్రుని బోలి యున్నదిగాన వీనికిచంద్రహాసుడను నామము తగియున్నది-యింక మేమేగుచున్నవారము,

కుళిందుడు॥ (కౌతుకముతో) జ్యోతిష్కులారా వందనములుగైకొనుడు.

జ్యోతిష్కులు॥ వ॥ (వినయముతో,) రాజోత్తమా నాయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధిరస్తుగా వర్ధిల్లుము,

జ్యోతిష్కులు వెళ్ళుచున్నారు,

రాజు॥ వ॥ (మంత్రినిజూచి) హో యిమంత్రిశేఖరమనక్రింది పెక్కండ్రు [illegible] లు కప్పములు చెల్లించకతిరుగబడియుండిరిగాన మన సైన్యంబును సైనికులను వెంటబెట్టుకొనిపోయి యీదుష్టులనెల్లజయించి కానుకలుగైకొని [illegible] ...

తే॥ గీ॥ గానసీవుసుజాగ్రతగలిగియుండుము।
మంత్రివగుచునుయిపుడునామాటవినియు।
సకలజనులకుప్రియముగాసంచరించు।
వినుతకీర్తినిబొందుమువిమలచరిత॥

వ॥ ఓకుమారా కుళిందుడనువాడు నాచేజయింప శక్యముగాని శత్రువులనెల్లను జయించి వారి ధనంబెల్లను సూరబుచ్చి - మనుపటికన్న నూ యిపుడు యేడుమడుంగులెక్కువ కప్పము గట్టుచున్నవాడు- నాతనినమితైశ్వర్యమును - నాకన్నులారాజూచి దానికి కారణమిద్దియని తెలుసుకొనుసిమిత్తము - వాని గృహంబునకుంబోవ నిశ్చయించినవాడను నీవునామంత్రిత్వమును - వహించి- జాగ్రతగలిగి యుండుము - యింకనే నేగుచున్నాడ॥

(మంత్రిపోవుసమయమునకుమాతెఱప్రవేశించును,)

మంత్రి, వ॥ కౌతుకముతో అమ్మా నీవిక్కేల బేలవై జాలినొందుచు - నరుదెంచినకతంబేమి చయ్యన సెరిగింపుము.

విషయ, వ॥ తండ్రినిచూచి ఓ యనా శుభకార్య మొకటి నడప గోరికగలదాననై దమకు నెరిగింపవచ్చితి.

మంత్రి. వ॥ వినయముతో అమ్మా మద్దుపట్టి అట్లనే శీఘ్రముగా నడపింపగలవాడ నీయంతఃపురమునకుంబొమ్మా.

అనిమంత్రిచెప్పి వెళ్లవలెను.

విషయ, వ॥ సంతోషముతో స్వగతం ॥ మాతండ్రిగారు శీఘ్రముగా వివాహముచేయదలచి యున్నవాడు - యింకనేగృహంబున కేగి నూతనవస్త్రభూషణాదుల నలంకరించుకొనెయెద॥

మంత్రికుళిందుడు.

మంత్రి, వ॥ హర్షముతో కుళిందుడా నీకుగల్గు అమితైశ్వర్యముం జూచి యింతటిమైశ్వర్యము యెట్లులభించెనోయ - యనుగ కోరికగ అవాడనైవచ్చితినీ యిందుకు కారణంబెద్దియో చెప్పుము॥

కులిందుడు - సంతోషముతో.

తే, గీ॥ మంత్రిపుంగవ నీవు నాతో వచింతు।
విపినమందున బాలుండు నేడ్చుచుండ।
నేనువీక్షింప దేహము నెత్తురగుచు।
యారోవ్రేలునద్రుంచిరియల్పులెవరొ॥

వ॥ స్వామి - నేనుయరణ్యమార్గమున బోవుచుండగా - ఒకపసిబాలుండు - కాలివ్రేళ్ళలోనారోవ్రేలునరుకబడి - రక్తముప్రవహింప - గట్టిగాబలవించుచు నేలంబడియుండెను - వానిని నేను - యెత్తుకొనివచ్చి స్వీకారము జేసుకొంటిని - అదిమొదలు నాకుబహువిధములయిన - సంపదలుగలిగెను - కింతయే కారణంబు॥

మంత్రికొంతముందుకువచ్చి,

మంత్రి - అద్భుతముతో,
బాలుఁడువీఁడేవాఁడును।
కాలిద్వ్రేలొకటివారుఖండనజేసి।
బాలునిగుఱుతులుజూపిరి।
మేలనుచునమ్మిమర్మమెరుఁగకపోతి॥

వ॥ యీబాలుఁడు నేనుకొన్నిదినములకు ముందు సూనరులకొప్పగించినవాడె ఆకులపాతకులు వానినిహింసింప - విడిచి కాలివ్రేలినొకటిని మాత్రము కోసుకొనివచ్చి - నాకుచూపిమోసబుచ్చిరి - తె ళించువానికుమారుని - నిచ్చటికిగొనిరమ్ము,

చిన్నవానినజూచిమంత్రి.

మంత్రి - ఆశ్చర్యముతో,

సీ॥ వీనిముఖకాంతికి నీడుగాకనుకదా చంద్రుడు నభోభాగమునజేరి
నాడు । వీనిలోచనములువీక్షించినతిరాక పద్మములేరె
నుపంకమందు । వీనిమధ్యముసరిబూనరాకనెగదా అడవుల
సింహములేయరుదగ్గ।వీనిదేహమునరనేనుతాళజాలనని

అంగజుడవుడుయవ్వనాంగుడయ్యె, గీ॥ ఇహవీనివర్ణింపనలవి
యగునే। దేవసముడనిజనులకు దెలియవచ్చు। లోకమన్మథుడ
నబోలునాకుచూడ । గాననెబ్బంగివీనికిష్టమెమదు,

స్వగతం.

వ. ఓహో యీడు నాకుమారుండైన మదనునికంటె - శ్రేష్ఠుడు గానున్నా
డు- వీనిముఖము పూర్ణచంద్రునివలె ప్రకాశించుచున్నది- సౌంద
ర్యమునందును గాంభీర్యమునందును- దేవతాలక్షణము గలవానివ
లె- దోచుచున్నాడు-కుంతలదేశాధిపతియు వృద్ధుడు - అతనికె పుత్ర
సంతతిలేదు- వొకపుత్రికగలదు- నాపుత్రుడగు - మదనుడు ఆ
రాజపుత్రిని పెండ్లాడి - ఆదేశమును- పరిపాలించునని యెంచియు
న్నాను- యీచంద్రహాసుడు- ఆరాజుకంటికెదురుపడెనేని- అతడు
మదనుని అవమానించి - చంద్రహాసునిమీద - మనసుతగిలి వానిని
క్రమ క్రమముగా మహారాజపదవికి గొనివచ్చునటకు - నెంత
మాత్రము సందియములేదు గాంచితి కానిమ్ము నొకనుపాయంబునూ
హించెద.

మంత్రిచంద్రహాసునకు సన్మానములగావించి.

మంత్రి, వ. సంతోషముతో చంద్రహాసా యిటురమ్మ - యీజాబును
గైకొనుము- నీవెచ్చటనిలువక కుంతలనగరంబునకుం బోయి
మద్గృహంబునకేగి మదనుండను నాకుమారునకిమ్ము అత్వ
గమునబొమ్ము.

(చంద్రహాసుడు జాబుతీసుకొనిపోవుచు,

చంద్రహాసుడు, వ. (కౌతుకముతో) స్వగతం ఒకానొక పురుషుండు వివా
హము జేసుకుని శంఖవేణుమృదంగాది మంగళవాద్యను
లు మ్రోయ భార్యతోగూడా గృహప్రవేశము జేయ
టంచూచితి - యిప్పుడే యీనిసదూరము దానితల్లితో
గూడ- తనగుడిశెదరిబోలుకొనిపోవుచు - గోపాలునో
కనించూచి.

(చంద్రహాసుఁడువనములో.)

చంద్ర, వ॥ (ఆశ్చర్యముతో) స్వగతం - ఆహాయీవనశృంగారంబేమి యిటి ఆమోదయ్యునిను పవనముశాఖోల్ల యిచ్చటవీచు మలయమారుత మునకు నాహృదయంబు పరమానందంబు నొందుచున్నయది కొంతదడవు నిచ్చటవిశ్రమించి మార్గాయాసంబుతీర్చుకొనియె ద-అనివిశ్రమించి. రాజకుమార్తెయగు చంపకమాలియు- మం త్రికుమార్తె విషయయువనములోనికివచ్చి.

జంఝూటిరాగం - ఆదితాళం.

ఘనమైనావనామిది గనుగొనుమ చెలియా । మనమూన । వెన్నెతర మా।వనటాసన్నిశైకత।నవయాము।నినాయమా। కనులకు చెలియా॥ఘను॥

మల్లెమొల్లాలును । మరిజాజి విరులచే । తల్లానిటాంపులాటు । ప ల్లావాపాణిమన । వుల్లముపానుల్లాసాము కొల్లాలాడెమ చెలియా ॥ ఘ॥

ధరమంగళాచలా । ధామాసివాసదో । వరకుల్లెశుసిపాదవనజా ములానుదలచి । విరబిరావువులుగోసినరిగెదు చెలియా,ఘ॥

విషయా, వ. చంపకమాలిని జూచి - చెలియా అతిరమణీయంబైన యీశృం గారవనంబును జూచితివిగదా - తాళహింతాళ రసాల ప నస జంబు జంభీర నారికేళాది అనేక ఫలవృక్షంబుల చేతను న్ను-శుకపిక నికరంబు లాదిగాగల పక్షిసముదాయంబుల చే తనున్ను-మల్లెమొల్ల సంపెంగాది నానావిధ పుష్పంబులచేతను- నొప్పియున్నయీవనంబుగాంచితివా మరియు.

చ॥ గాయకోనీవనంబునకు చెంగటకోస్తిమిజూడు నేర్పుగా।
చిలుకలుపావురంబులును చేరియుకూయగనాగజూడుమా।
పలుకులు నాలకించిమరిబాలరసాలముమల్లెమొల్లలున్ ।
బళిదరవింద కైరవకదంబముజూడుము నీవ్రకోమలీ॥

చంపకమాలి॥ వ॥ (సంతోషముతో) అవును చూచితిని చెలి వీనులకనానంద ము గానంబొనర్చుచున్నవి యిపి యేమిటి.

విషయ, వ॥ (ఆశ్చర్యముతో.)

క॥ కొ [illegible] విసునీవనమున।
ని [illegible] నితొమ్మొదలుసునిటువలె [illegible] యుక్।
[illegible] దము వేగమె।
[illegible] పుష్పములుగోసియుందునిధా [illegible]॥

వ॥ అని [illegible] మ్మొదలయొకరి ఝుంకారము.

చంపకమాలి, వ॥ (ఆశ్చర్యముతో) చెలి యిచ్చట కలకల ధ్వనులచే కలకల లాడుచున్నవి నవియేమిటి,

విషయ, వ॥ నవియె శుకపికరవంబులు.

చంపకమాలి, వ॥ చెలి ఘుమఘుమవాసనలచె చెన్నొందు యీచిన్నపుష్ప ములపేరేవి.

విషయ, వ॥ యిటుమాటలతో ప్రొద్దు బుచ్చనేలా నచ్చటచ్చట దిరిగి పుష్ప లంగోసుకుని నాటకాడ కొందమురమ్ము.

(అనిపుష్పాలు కోసుకొని.)

విషయ,వ॥ (సంభ్రమముతో) రాచకూతురు పీంచ పుష్పాలుచల్లి నీవు శీఘ్రముగా దగినమగని పెండ్లాడి భాగ్యశాలివై సుఖింతువుగాక,

వ॥ రాచకూతురు విషయమీదపుష్పజల్లినీవు ఖమునందు యిప్పుడుకనబడుచున్నట్టి శుభలక్షణములను జూడ నీవునేడే త్రిలోకసుందరుండైన పురుషునొకని పెండ్లాడుదువని నాకంతోచుచున్నది.

విషయ,వ॥ (చంపకమాలినిజూచి) నీవిచ్చటనే యుండుము నేనచ్చటిచ్చటం దిరిగి పుష్పంబులంగోసుకవచ్చెదను.

అని చంద్రహాసునిజూచి.

విషయ, వ॥ ఆశ్చర్యముతో - స్వగతం,

సీ॥ బాలుండునేలపైపవళించియున్నాడు । చూడగావీక్షితను [illegible]
దరుండు । [illegible] । భూలోక
[illegible]

నిత్యుశరాసనంబితనికేది । కనులవాంఛలుబోలు కళలచేనొప్పు
నుకరములు శంఖుచక్రములులేవే॥ గీ॥ గానసీతమనోకరాజ
సూనుడగును । వీనివర్ణింపశక్యమే మానవులకు। మనసుదీ
రగ వీనితోమరునికేళి । గూడితీరగ వలయును వేడుకలర॥

వ॥ యిచ్చట యెవరో నొకబాలుడు మార్గాయాసముచే పరుండినిద్రించుచున్నవాడై వీనిముఖముజూడగా పూర్ణచంద్రునిం బోలియున్నది, వీనిహస్తంబునం దొక్క లిఖితంబు గానంబడుచున్నదే, (దగ్గిరకువెళ్ళిచూచి) స్వగతం, యీజాబుపైని మాతండ్రిగారిచే వ్రాలున్ను యాయనముద్రయున్ను నున్నటుల గన్పట్టుచున్నది, మా నాయనగారు ప్రయాణమైపోవునపుడు నాకు అతిశీఘ్రముగా వివాహముగావించెదనని వచించియున్నవాడు మత్సోదరుండగు మదనునకు శుభలేఖ వ్రాసిపంపెనేమో చదివిచూచెద. (అనిజాబుచేతితీసుకుని) [విషయు] నాదుపుత్రుండగు చిరంజీవి మదనునికె సమస్తభాగ్యమును గలుగుగాక, యీపత్రికను గొనివచ్చెడు చంద్రహాసుడు, నాకువాస్తవముగా, సమిత్రుడు. వాడునాసొత్తునకుగాకొన, ఆశగలవాడు, గనుక వానియొక్క యావ్వనము, ముఖవిలాసమునుజూచి, నాయభిప్రాయము సరియని తెలుసుకొని- వీడుయెవనిపుత్రుడు, అధికుడా, అల్పుడా, సమర్థుడా, విద్యావంతుడా, మూర్ఖుడా, అనునివి విచారమేమియుజేయక, వానికివిషమునిమ్ము॥

విషయ॥ వ॥ (ఆశ్చర్యముతో) స్వగతం ఆహా విషమునిమ్ము అనివున్నదే, నేనుచదువుట పొరపాటా యేమి, లేక నానేత్రముల కండ్లగా న్పించెనా, అయినను మరియొకసారి చదివిచూచెదను॥

[ అనిపైమోస్తరుచదువవలెను ]

వ॥ ఆహా యేమి విషనిమ్ముఅని యేవున్నదది యిట్టిబాలునిజంప మా

తండ్రిగారి కెట్లు మనసొప్పును. యీవాక్యము వినిన మాత్రముననే, నాచిత్తము తత్తరజెందుచున్నది. మరల నీలిఖితంబు వీనిచేతికివ్వ నాకెట్లు మనసొప్పును, కాదు వ్రాయుటయందు నేదియో పొరపాటై యుండవచ్చును, యిప్పుడైననునేమి, నానేత్రముల కీడిన కాటుకను దీసి నాముక్కుపోగుచే నమిత్రుడన్నమాట నేమిత్రుడనియును విషమునిమ్ము అనుమాట విషయనిమ్ము అనియును దిద్దెదను( అనిదిద్ది మరల తెలియకుండునటుల చేతికిచ్చి)

చంపకమాలి వ॥(విషయనుజూచి) ఓవిషయా నీముఖము నాసూక్ష్మ బుద్ధిచే దృష్టించిచూడగా నీవొకపురుషునిజూచి మోహించి నటుల జాడగనబడుచున్నది.

విషయ॥ వ. (సంతోషముతో) నీమాటలకేమి వ

చంద్ర॥ వ॥ (నిద్రలేచి ) ఆహా నేవచ్చి చాలా తడవాయను యింకయిచ్చటనుండం జనదు అతిరయంబున అమాత్యుని పట్నంబునకు కేగెద.

చంద్ర॥ వ॥ (మదనునిజూచి) అమాత్యపుత్ర మీతండ్రిగారు యీజాబునీకివ్వమనిరి నాచేతిలెంబంపె యిదిజూచుకొనుము.

( అనిచేతికిచ్చి, )

మదనుడు॥ వ॥ (సంతోషముతో) యేదితెమ్ము చదివిచూచెదను, నాదుపుత్రుడగు మదనునిక శ్రీరస్తు చిరంజీవిగా సమస్త భాగ్యములను గలుగుగాత ఈపత్రికను గొనివచ్చెడు చంద్రహాసుడు నాకు వాస్తవముగానే మిత్రుడు, వాడు నాసొత్తును గైకొన ఆశగలవాడు, గనుక వానియొక్క యవ్వనమును ముఖవిలా

సమునచూచి నాయభిప్రాయమును సరియని తెలుసుకొని నీ
వు మెవనిపుత్రుండు, అధికుండా, అల్పుడా, సమర్థుడా, అసమ
ర్థుడా, విద్యావంతుడా, మూఢుడా, అనువిచార మేమియును
జేయక వానికి విషయనిమ్ము.

మదనుడు॥ వ॥ (ఆశ్చర్యముతో) ఆహాయేమి మాతండ్రిగారు విషయనిమ్ము
యని ఖండితముగా వ్రాసియుండిరే అట్లునే వివాహముజ
రుపనియెడల తండ్రియాజ్ఞకు అతిక్రమించినవాడనౌదు.

మదనుడు॥ వ॥ (సేవకునిజూచి) ఓరే సేవకా మనపట్నంబునంగల జ్యోతి
షుల-రావింపుము.

సేవకుడు॥ వ॥ (సంతోషముతో) చిత్తము తమ యాజ్ఞాప్రకారము నాలా
గె పిలుచుకవచ్చెదము,

మదనుడు (చంద్రహాసునిజూచి)

తే॥ గీ॥ చంద్రహాసుడలగ్నము జేతునీకు।
పెండ్లికొడుకవుగమ్ము బహుప్రీతిగాను।
భూరియంగదమకుటాది భూషణములను।
వేగధరియించుమిప్పుడే వేడుకలర॥

వ॥ చంద్రహాసా నీకులగ్నమును విచారించి వివాహ ప్రయత్నము చే
యుచున్నాడ నూతన వస్త్ర భూషణాది అలంకృతుడవై పెండ్లి
కుమారుడవుగమ్ము.

మదనుడు॥ వ॥ (సంతోషముతో) జ్యోతిషుల-లారా వందన మాచరించెద.

జ్యోతి॥ వ॥ ( మదనునిజూచి ) ఓమంత్రికుమారా సకలైశ్వర్యాభి వృద్ధి
గావర్థిల్లుము,

మదనుడు॥ వ॥ ( ప్రియముతో ) ఓజ్యోతిష్కులారా నీయుచితాసనంబున వచ్చేయుడు.

జ్యోతిష్కులు॥ వ॥ (సంభ్రమముతో) తమయాజ్ఞప్రకారము నీయుచితాసనములయందు వసించితిమి మమ్ము బిలిపించిన కార్యం బెద్దియో శీఘ్రముగా నెరింగింపుము.

మదనుడు॥ వ॥ (కౌతుకముతో) ఓ జ్యోతిష్కులారా మాచెల్లెలగు విషయను, చంద్రహాసునకు వివాహము జరుపమని మాతండ్రిగారు ఖండితముగా నుత్తరంబును వ్రాసిపంపె వారి యాజ్ఞను మిక్కిలి జాగ్రతతో నెరవేర్చినట్లు తెలియజేయవలెను, నాలస్యము సేయకుండా ముహూర్తము నిశ్చయింపుడు.

జ్యోతిష్కులు॥ వ॥ (సంతోషముతో) అటులనే విచారించెదము.

వ॥ (ఆజ్యోతిష్కులు జూచి) ఓ మంత్రికుమారా నేటిదినంబున సూర్యాస్తమయమందు శ్రేష్ఠమైన ముహూర్తమున్నదిగాన పురోహితులరావించి శీఘ్రముగా వివాహముజరుపుము యింకమేమేగెద.

మదనుడు॥ వ॥ (సేవకులనుజూచి) ఓరీసేవకా మన పట్నంబంతయు పచ్చ తోరణంబులచే శృంగారముగావింపుము.

( పిమ్మట పురోహితులు చంద్రహాసుడు విషయ వివాహ కాలమున సంకల్పము చెప్పుచున్నారు. )

పురోహితుడు॥ వ॥ (సంతోషముతో) శ్రీగోవింద గోవింద, శ్రీమహావిష్ణోరాజ్ఞయా ప్రవర్తమానస్యాద్య బ్రహ్మణః ద్వితీయ పరార్థే, శ్వేతవరాహకల్పే, వైవస్వత మన్వంతరే, కలియుగే, ప్రథమపాదే, జంబూద్వీపే భరతవర్షే, భరతఖండే, మేరోర్దక్షిణదిగ్భాగే, శ్రీశైలస్య, యీశాన్యప్రదేశే కృష్ణాగోదావర్యోర్మధ్యదేశే - సమస్తదేవతా బ్రాహ్మణసన్నిధౌ అస్మిన్వర్తమాన వ్యావహారిక- చాంద్రమానేన-సంవత్సరే- అయనే ఋతౌ మాసే - పక్షే-తిథౌ - వాసరే - శుభనక్షత్రే - శుభయోగే-శుభకరణే యేవంగుణవిశేషణ - విశిష్టాయాం శుభతిథౌ -

# కంపెని డ్రామా.

శ్రీపరమేశ్వరముద్దిశ్య - శ్రీపరమేశ్వరప్రీత్యర్థమ్ మహాపాతకదురితక్షయార్థమ్- చంద్రహాసవిషయె వివాహం కరిష్యే,



పురోహితులు॥ వ॥ (చంద్రహాసునిజూచి) ఓచంద్రహాసా మీతండ్రి పేరు, మీతాతపేరుజెప్పుము,

చంద్రహాసుడు॥ వ॥ (సంతోషముతో) ఓపురోహితులారా సర్వశక్తి సమేతుండగు- ఆదిశేషుడే నా తండ్రియును - నాతాతయును- అతడుతప్పవేరే తలిదండ్రులయినను - తాతనైనను, నేనెరుంగను,

మదనుడు, వ॥ (కౌతుకముతోగా) ఓపురోహితులారా లగ్నకాలము తప్పిపోవుచున్నది ఆలస్యముచేయక మాంగళ్యధారణచేయుడు,

పురోహితులు, వ॥ (మదనునిజూచి) మంచిది నాలాగే చేయుచున్నాము,

పురోహితులు, వ॥ (హర్షముతో) ఓంతద్బ్రహ్మ ఓంతద్వాయుః ఓం తదాత్మా ఓంతత్సత్యం ఓంతత్సర్వం- ఓంతత్పురో

ర్నమః అంతశ్చరతిభూతేషు- గుహాయాంవిశ్వమూర్తి
షు - త్వంయజ్ఞస్త్వంవషట్కారస్త్వ మింద్రస్త్వగ్ం
రుద్రస్త్వం-విష్ణుస్త్వం-బ్రహ్మత్వంప్రజాపతిః,

పురోహితులు, వ॥ చంద్రహాసుని జూచి వోయి చంద్రహాసా మాంగళ్య సూత్రము నీభార్యయగు విషయ మెడకు ధరించుము-

చంద్రహాసుడు, వ॥ కౌతుకముతో వో పురోహితులారా తమయాజ్ఞప్రకారముధరించితిని,

పిమ్మటమంత్రివచ్చి రౌద్రముతో,

మంత్రి, వ॥ కుమారునిజూచికోపముతో వోరి బుద్ధిహీనుడా నీవేమి పనిజేసితివి- నేనొకసంగతి వ్రాసిపంపగా న్యాయభిప్రాయ మిట్టిదని దెలుసుకొనజాలక చంద్రహాసునికి నాముద్దుకూతును వివాహముచేయించి నాధనమంతయు - నీవునందరికి దానముజేసి నష్టపరచితివి గదా - నిన్నేమి చేయవచ్చును- ఛీ నీముఖముచూడవచ్చునా॥

వ॥ మదనుడు- వినయముతో వోనాయన కోపముచేయక యీజాబునుజదువుకొనుడు.

(అని జాబుచేతికిచ్చి,)

మంత్రి॰వ॥ (జాబునుజూచి,)

క॥ యిపుడీనుజాబునుజదువగ।
కపటముగనరాధునాదుగర్వముచేతన్।
నిలనొకటిజేయబూనిన।
దలచెనదనమదినొకటిదైవముతానన్॥

వ॥ అవును విషయనిచ్చు ఆనెవున్నది పొరపాటున నిటులవ్రాసితిని ప్రాబోలు- నేనొకటితలంచిన దైవంబొకటితలంచె - తన్నుతానిందించుకున్న నేమిప్రయోజనము- నెవరయిననువిన్న పరిహాసము చేయుదురు గదా- మంచిది,

చంద్రహాసుడువిషయ,

చంద్రహాసుడు, వ॥ కౌతుకముతో వోమామగారు వందనము చేయుచున్నాడ,

విషయ, వ॥ తండ్రిని జూచి వోనాయనగారు వందనము చేయుచున్నదాన,

(అనియిరువురు కాళ్ళకుమ్రొక్కేన,)

మంత్రి,వ॥ [చంద్రహాసునిజూచి] వోయిచంద్రహాసా నీవు నూతనపెండ్లికుమారుడవైనందున దీర్ఘాయుష్మంతుడవుగమ్ము,

మంత్రి॥వ॥ (చంద్రహాసునిజూచి) వోచంద్రహాసా- మాపిల్లను పెండ్లాడినవాడు- యాదినమే - యీపట్టణమునకు వెలుపల నెలకొనియున్న-దుర్గాదేవికి - యస్తమసంధ్యవేళ - పసిడిహరివాణమున- నైవేద్యముగొనిపోయి- సమర్పించుట - మాచారమైయున్నది నీవటుల సేయుము,

చంద్రహాసుడు, వ॥ ప్రియముతో చిత్తమునాలాగేచేసెదను,

మంత్రి॥వ॥ (సేవకునిజూచి) వోరేసేవకా మన పట్నంబునం గల సూనరులను యిచ్చటకురావింపుము,

(సేవకుడుబిలువగా సూనరులుప్రవేశించి,)

సూనరులు, వ॥ (మంత్రినిజూచి) మంత్రివరా మమ్మిట్లేల బిలిపించితిరి విశదముగాదెలియజెప్పుడు,

మంత్రి, వ॥ సూనరులనుజూచి మత్తకోకిల,

ఓరిసూనరులార వేగమెనొప్పుగానిటుమీరలున్।
వూరిబైటనుకాళికాగుడియున్నదాగుడిలోపలన్।
జేరిదాగియుండియీదినసంధ్యకాలమునందునన్

మీరునుక్ఫలహారముక్గొను మేదినీశ్వరుజంపుడీ॥

వ॥ సూనరులారా మీరు యీయూరి వెలుపలనున్న దుర్గగుడిలోపలికి బోయి - దాగియుండి - అక్కడికి యీదినమునసంధ్యాకాలమునబం గారుపళ్లెమునందు నైవేద్యము దుర్గకుకొనివచ్చెడు మనుష్యునిజం పివేయుడు నిదియేమాయుమ్మాటికి సెలవుపొందుడు,

సూనరులు, వ॥ (మంత్రిని జూచి) మంత్రివరా మహాత్మా అట్లునేతమయా జ్ఞ ప్రకారముగావించెదము,

[రాజుజ్యోతిష్కులువదనుడు కోర్చు,]

రాజు, వ॥ జ్యోతిష్కులనుజూచి,

తే, గీ॥ జ్యోతిషంబునుమీరునుబూచివేగ।
దెలియజెప్పుడినాకునుతేటగాను।
అద్దమందునజూడగ అద్భుతముగ।
శిరసుకనుపించదాయెనీచిత్రమేమి॥

వ॥ జ్యోతిష్కులారా గడచిన రాత్రి నొకచెడ్డకలగంటిని దాని నిజం బుదెలియుటకై అద్దమందునక్జూచితి నందుశిరంబులేకయే - మొం డెంబుగాన్పించే-నిందుకు ఫలంబుజెప్పుడు.

జ్యోతిష్కులు, వ॥ రాజును జూచి రాజోత్తమా యెవనికి శిరంబు లేక కనుపించునో నట్టివానికి నేషుదినములయందు మరణము గలుగునని సాముద్రిక శాస్త్రమునందు పెద్దలు వక్కా ణించియుండిరి నిదియునుంగాక,

తే॥ గీ॥ జాయతేమరణమనుచును జెప్పుశాస్త్ర।
మెరిగియుండిరిమీరును మేలుగాను।
గాననీపుత్రిపెండ్లియుకదురయమున।
జేయుముదమునసీవుభూజనులుబొగడ॥

వ॥ హోరాజోత్తమా జాయతే మరణంధ్రువంబని నెంతవారికైన మరణం మునిద్ధమన్నమాట నందరికి దెలియతగినదే కదా - మీకుమాతెలుసు

వివాహముగావించి యావహోత్సవము మీకన్నులారా చూడుము నేటిదినంబె నన్నికార్యములకు - ననుకూలముగానున్నది నిందుకమీ యిష్టప్రకారము-గావింపుము.

రాజు, వ॥ (జ్యోతిషుకులనుజూచి) వోజ్యోతిషుకులారా అటులయినతగినయ ల్లుని మీరేవిచారింపుము.

జ్యోతిషు-లు, వ॥ రాజునుజూచి.

తే॥ గీ॥ చంద్రహాసునికిమ్మా నీచంద్రవదన।
వాడెనీసొత్తుకపహరించువాడు స్తవము గ।
వాడెయల్లుడునీకునువా స్తవము గ।
పెండ్లి జేయుము వేగమే ప్రీతితోను॥

వ॥ ఓరాజోత్తమా యీ పట్టణంబున చంద్రహాసుండను, వాడు నీసొత్తును గైకొనదగినవాడు - వాడేనీయల్లుడు వానిం గొనివచ్చి - అతిశీఘ్రముగా పెండ్లిజేయుడు యింకమేమెగెదము,

(జ్యోతిషుకులువెళ్ళుచున్నారు.)

రాజు, వ॥ (మంత్రినిజూచి.)

ఉ॥ యీదినమందురాజ్యమునునిచ్చియువేసెదజూడుమిప్పుడె।
పోదునుకాననంబునకుభోగములన్నియుమానివేసితిన్।
వాదులుయేలనాకుమరివారిజతోగోరితిమాధవాచ్యుతున్।
మోదముతోను తేండిటకుమాద్దులయల్లునిచంద్రహాసునిన్॥

వ॥ వోమంత్రివరా నేను యీదినమే రాజ్యమునుండి తొలగవలయుననినిశ్చయము జేసుకొంటిని - చంద్రహాసునియొక్క - సద్గుణసత్కృ

త్త్వములను నేను విన్నంతట నారాజ్యము పరిపాలింప వాడేతగిన వాడని నాకుదోచుచున్నది, కావున నీవీక్షణమేపోయి చంద్రహాసుని అతిశీఘ్రముగానానగరికి తోడితెమ్ము వేగమేపొమ్ము,

రాజు, వ॥ (సేవకునిజూచి) ఓరీసేవకా వనపట్టణంబంతయు పచ్చతోరణంబులతో శృంగారముగావింపుడు,

సేవకుడు, వ॥ (రాజునుజూచి) చిత్తమునాలాగే గావించెదము.
(చంద్రహాసుడు నైవేద్యముగొని పోవుచుండగా,)

మదనుడు, వ॥ (చంద్రహాసునిజూచి) ఓచంద్రహాసా నీవెంత మాత్రమును కాలవిలంబనముచేయక - రాజునగరికిపోవలసిన యావశ్యకమైయున్నది - నీకుమాఱుగా యీ నైవేద్యమును నేనుదీసుకొనిపోయి దుర్గకుసమర్పించెదను నాచేతికిమ్ము.

(అని తానుతీసుకొని.)

(మదనుడుపోవుచు) స్వగతం,

వ॥ ఆహాయేమి ఒక గద్దగూబ తటాలున నాతలమీదవ్రాలెను-రెండు పిల్లులు జగడమాడుచు - నాకడ్డముగాబోయెను - కారణములేకయే నాకన్నులనుండి నెత్తురు బొట్లుపడెను - యీ అపశకునములు చూడనాకుభయముకలుగుచున్నది-దుర్లభుండైన - నాభావమరిదికి తమే గుఱించియే తోచుచున్నది- దుర్లభుండైన - నాభావమరిదికి యే కొఱతయును గలుగ కుండుగాక - యేదేనియు గలుగునేని అదివానికే మారుగా - నాకుసంభవింప వలయునని భగవంతుని ప్రార్థించెదా.

శాంతసుఖనిరంతరంబనువర్ణమెట్టు,

కరుణించి బ్రోవరావదేర - కామసంహార్వరా॥ దరిజేర్పనీవేది

కుర-దారిజూపరా॥క॥

నందివాహనరూఢ - నాగేంద్రభూషణా । అంధకాసురహం

రకానన్ నాదరించరా॥క॥

ధరను మంగళాద్రిపురా । ధామవాసకా । కరుణాతో మల్లే

శ్వరాననుకావవేమిరా॥క॥

(అవినుతింపుచుమగఁగుడికెపోయిన మదనుని సూనరులు ఖండించుట.)

(రాజుచంద్రహాసుడు ప్రధానులు)

రాజు-(చంద్రహాసునిజూచి)

తే॥ గీ॥ చంద్రహాసుడయిపుడునీవుచెలువముగను।
భూషణంబుధరియించుబంధులుమెచ్చ।
నాదుమకుటమునిచ్చెదమోదమునను।
నీవురాజ్యముపాలించునికనుమీద॥

రాజు॥ వ॥ (చంద్రహాసునిజూచి) వోచంద్రహాసా నిదిగో నాకిరీటంబునన్నీ
శిరంబునధరించుకొనుము,

(పరివారముతోరాజు,)

రాజు, వ॥ (పరివారకులనుచూచి,)

క॥ యీశసిరాజుగజేసితి।
యీతనితోకలసిమెలసియిప్పుడుమీరుఁ।

యీతని వాక్యము వినుచును।
యీతని ప్రేమించవలయు నిష్టముతో సూ॥

వ॥ హో యి పరివారకులారా యీ భాగ్యవంతునికి నా కొమా ర్తెను యౌవరాజ్యం బకమాలిని నిచ్చి వివాహం బొనర్చితిని - నీతని మీకు రాజుగా జేసితిని - వీనిమీరును వీని యేలుబడి క్రిందికాపులును - యందరును చక్కగా జీవింతురు గాక యని దీవించితి,

పరివారకులు॥వ॥ (రాజును జూచి) హో రాజోత్తమా చంద్రహాసుని మాకు రాజుగా జేసినందున మేము పరమానంద భరితాంతరంగులమై యంగీకరించితిమి మాకు మేమొక్క కొరతయును లేదు.

(ఇంతలో మంత్రివచ్చి.)

మంత్రి వ॥ (చంద్రహాసుని చూచి) హో చంద్రహాసా నాకుమారు డెచట నుండెను,

చంద్రహాసుడు, వ॥ (మంత్రిని జూచి( మహాత్మా నాచేనన్నని యి వేద్యము గాని భావగారు దుర్గ గుడికి బోయెను,

మంత్రి ఆశ్చర్యముతో,

వ॥ ఆహా దుర్గ గుడికి బోయెనా - యెంత మోసము వచ్చెను.
అని దుర్గ గుడికి బోయి అచ్చట పడియున్న కుమారునిం చూచి దుఃఖముతో॥

ద్విపద.

యెంత మోసము వచ్చె యెరుగక పోతి।
యింతాలోని చావు యిటు వచ్చు నెరుగ।

తలచినకార్యము దైవమిట్లు జేసె।
యిలలోన నే బ్రతికి నేమి శేయుదును॥

వ. హా కుమారా మదనాఖ్య నీ కెంత అకారణమృత్యువు సంప్రాప్తమాయెను, పట్టరాని యీ వ్యసనము చే చంద్రహాసుని తండ్రియైన ఆకుళిందునిపై మిగుల కోపించి వానిని వానితోటి వారిని జెరసాలయందు బెట్టించి, వానియధికారమును, సొత్తును, మరెవ్వరికిని యాధీనము చేసినది గాక కుళిందుని క్రిందికాపుల నెల్లగొట్టి మిక్కిలి హింస జేసి, వాని స్వీకృతపుత్రుడగు చంద్రహాసుని సహితము చంపించెదనని యధికానందముతో నున్నవాడ, యింత మోసము వచ్చుట యెరుగనైతిగదా, యీ రాజ్యమున కధికారి నీవేననుకుంటి, నేనొకటి దలంచ దైవంబొకటి తలంచె, యింక నే నెవ్వరి జూతు, నిందలపాలైతిగదా, నే బ్రతికి నెవ్వరి రక్షింతు, యీ ఖడ్గముచే నేను మృతిబొందెద (అనిపడిపోవలెను,)

చంద్రహాసుడు (దుఃఖముతో)

ద్విపద.

శంకర నీవు నా సంకటము బాప
యింకా నీకృప రాదు యేమి శేయుదును
మామయు భావయు మరణము నొందె
కామసంహార వేగ కరుణించి బ్రోవు॥

వ॥ హా శంకరా జగద్రక్షకా, నే జన్మించినదాదిగా పడరాని యిడుములబడి, నేటికి ధన్యుడనైనాడనుగదా యనిమనంబున మిగుల నల్లాసముచేనుండ, యిట్టి కాలమున నాకుపకారము జేసిన బావమరిది యగు మదనుడు, అకాలమృత్యువు సమీపించి మృతిబొందెను, యీ కారణంబు మామగారు దెలుసుకొని ఇట్టి ముద్దులతనయుండు చచ్చిపడియుండ నేను బ్రతికినఫలమేమని తానును మరణము నొందినవాడాయెను యింక నేను యీ ఖడ్గముచే మృతిబొందెదను,

(ఇంతలో విషయ చంద్రహాసుని హస్తము బట్టుకొని,)

విషయ, వ॥ (చంద్రహాసునిజూచి) ఓ ప్రాణేశ్వర నాజనకసోదరాదులను దుర్గాదేవిని స్తోత్రముజేసి సజీవులజేసెదజూడుము.

చంద్రహాసుడు, వ॥ (విషయనుజూచి) ఓప్రాణనాయకి నీవతిశీఘ్రముగా దుర్గాదేవిని స్తోత్రముజేసి సజీవులజేయుము.

విషయ, వ॥ (దుఃఖముతో) నాథా తమయాజ్ఞప్రకారము దుర్గాదేవికిస్తోత్రము చేయుచున్నదాన యంతరంగంబున చింతనొందకుము.

(విషయదుర్గాదేవిని దనమనంబుననిడుకొని స్తోత్రముజేయుట,)

దండకము.

శ్రీమన్మహాదేవు రాణిభవాని నిత్యకళ్యాణి శర్వాణి దాక్షాయణీ శూలపాణీ పృథుశ్రోణివీణాసిలవేణీ లసత్కీరవాణీ శివాశాంకరీ రాజరాజేశ్వరీ గౌరిశాకంబరీ కాళికంకాళి రాజీవనేత్రి కళ్యాణగాత్రీ మహాదైత్యజైత్రీ నగాధీశపుత్రి స్ఫురద్దివ్యమాణిక్య దీపప్రభాత్ఫుల్లకంజాత కేయూరహారాంగదాది జ్వలద్భూషణా వ్రాత కౌమారిమాహేశ్వరీ నారసింహీ రమా వైష్ణవీ దుర్గ కాత్యాయనిపార్వతి నీదుసామర్థ్యమెన్నంగ బ్రహ్మాదులున్ శేష భాషాదులున్ జాలరే నెంతదానన్ బ్రశంసింపనోయాదిశక్తి పరంజ్యోతి నీసన్నిధిన్ బ్రాణముల్ బాసియున్నట్టి మజ్జనకునిన్ సోదరున్ వేగ జీవంబులన్నిచ్చి కాపాడుమో కాళికాదేవి నేజేయునేరంబులున్ గాచి నన్నేలిరక్షింప నీభారమో తల్లి సద్భక్తమందారవల్లీ నమస్తే నమస్తే నమః.

(ఇట్లువిషయస్తోత్రముజేయ కాళికాదేవిప్రత్యక్షమై,)

కాళికాదేవి, వ॥ (విషయనుజూచి) ఓవిషయా నీవిమరమ్మా నిచింతగాప్రార్థించినావుగనుక నీకుప్రత్యక్షమైతి నీయభీష్టముకోరుము యిచ్చెద,

విషయ, వ॥ (సంతోషముతో) ఓజనని నీసన్నిధియందు మృతులైయున్న మజ్జనకసోదరులను సజీవులజేయుము యిదియే నాయభీష్టము.

కాళికాదేవి, వ॥ (విషయనుజూచి) ఓవిషయా నీవీప్రాణియుంబు గా

పోయి నీజనకసోదరుల మీఁదజల్లుము వారు సజీవుల వుదురు.

( విషయ జనకసోదరులమీఁద జలంబుజల్లుట, )











మంత్రి, వ॥ విషయనుఁజూచి ఓపుత్రీ నీచేతఁబున మృతులమైనమేము సజీవుల మైతిమి నీకుమీఁదమీఁదను సుఖభోగభాగ్యములుగల్గివర్ధిల్లుదు,

మంత్రి, వ॥ (చంద్రహాసునిజూచి) ఓచంద్రహాసా నేనీకొనర్చిన నపకారంబు నీమనంబునసుంచక సమస్త భోగభాగ్యములుగల్గి వర్ధిల్లుము,

చంద్రహాసుడు, వ॥ చిత్తము తమయాజ్ఞ ప్రకారము ప్రవర్తించెద.

అనియందఱు వెళ్ళుచున్నారు,

మంగళహారతి.

మంగళంభవతుమహేశశంకరా । అంగజాహరశ్రీభు । జంగభూషణా॥ మం॥

పాలలోచనిసుందరాంగా । పార్వతీశ్వరా । నీలకంఠా త్రిపురహరణా। నిర్మలాత్మకా॥ మం॥

ధరనుమంగాళాద్రిపురా। ధామవాసకా। వరమల్లేశ్వానిర్వికారా। వాసవార్చితా॥ మం॥

గద్య.

ఇది, శ్రీపరమేశ్వర పాదారవింద నిష్యందమకరంద పానానంద తుందిల మానసేందిందిరుండును శ్రీమద్భారత ఋషీసగోత్రాపస్తంభ సూత్ర పవిత్ర శ్రీమద్గంజివంశ పయః పారావార రాకా నిశాకరుండగు కనకయాఖ్యపౌత్ర నారసింహ్వాపుత్ర బుధజనవిధేయుండు నగు నాగయ్యాకవిచే రచియింపబడిన

---

చంద్రహాసనాటకము.

సంపూర్ణము.

---